గురువు : పూర్వజన్మసంస్కారం లేనివారికి సత్యము తెలుసుకొనే అర్హత లేదు. సామాన్యమానవులకు అది అగ పడదు. సత్యము గుంపుకు దూరం. అల్పమైన నమ్మకాలతో కొట్టుకుంటున్న జనులకు, అది జుగుప్సాకరముగా తోస్తుంది. జడునకు అది అందని ఫలం. కించిదజ్ఞులు, అల్పదేవతలు కల్పిం చిన ధర్మాలు నామమాత్రమైనవి. మహాధర్మం వాటిని పాటిం చదు. అటువంటి మహాధర్మాన్ని మీరు అవగతము చేసుకోవా లనుకుంటే, రాజకుమార! ఇటు వినండి!

సారంగధరుడు : జ్ఞానముకంటె ఆనందదాయకమైనది నా కింకొకటి లేదు. మహాజ్ఞానమే నాకు పరమానందము.

గురువు : మంచిది రాజకుమార! ప్రతి మాటను జిజ్ఞా సతో వినండి! మాతృస్తన్యముతోపాటు అనూచానముగా, అల వడుతున్న నైతిక భావాలను లక్ష్యపెట్టవద్దని, తృణీకరించమని, ఈ మత శాఖ,మీకు బోధపరుస్తున్నది·సామాన్య నైతికసూత్రాలు దేనిని పాపమని ఖండిస్తున్నవో, దానిని ఇది ఉత్కృష్టమని భావి స్తుంది; వాటికి ఏది నిషిద్ధమో, అది దీనికి అవలంబనీయం; శిరో ధార్యం. సత్యములలోకల్లా మహాసత్యం ఇదే· రహస్యములలో కల్లా పరమరహస్యము ఇంతే. మీరు జీవితమునకు మూలమైన స్త్రీని ప్రేమించవలె; స్త్రీని, మీరు, జీవితమును ప్రేమించినట్లు కాక, ఆమెలోని, దైవమును ఆరాధించవలె. స్త్రీని ఆరాధిస్తున్న కొద్దీ, వెలుగొందే జీవనజ్యోతితో మీ ఆత్మను మీరు తేజోవంతం చేసుకోవచ్చును.

---

* ఇది చిత్రాంగి అనే ఈ నాటకమునకు మొదటి అంకము: ఒకటవ రంగము.

సారంగధరుడు : సరే;

గురువు : మంచీ చెడూ అనేవి ఎక్కడాలేవు. అంతా మిథ్య. లోకం ఒక భ్రాంతి. మీరు జీవించక తప్పదు కనక, జీవిస్తున్నంతకాలం, ఆభ్రాంతిని ప్రకాశవంతం చేసుకోకతప్పదు. మీరు గతించినపుడు, విశ్వమంతటా వ్యాపించివున్న శక్తిలో లీనం కావలసి వుంటుంది. శక్తి అంటే ఏమిటి? స్త్రీ! మధువు! విజ్ఞత వున్నవారికి అవి జీవితం. లేనివారికి అవే మరణం.

సుబుద్ధి : అయితే ఈ లోకంలో దుర్గ, ఏమిటి యిస్తుంది?

గురువు : దుర్గను ఆరాధించిన రాజకుమారుడు చక్రవర్తి కాగలడు!

సుబుద్ధి : [రాజకుమారుని చెవిలో] పాపం ! మనం చేస్తున్నది ఆయనకి అర్థంకాలేదు;మనల్ని తన మతంతో ముడిపెట్టి ఏమిటో బోధిస్తున్నాడు. *

---

*శివశక్త్యా ఇత్యాది శ్లోకములను ఇక్కడ వ్రాయవలెనని మహాకవి నోటు చేసుకున్నారు.



## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | NPRO1E133 | Date | 11/04/2023 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | viii, CI, 251 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Yameema | Cutting By | Yameema |
| Scanned By | Lakshmi | Pages | 269 |
| Quality Checking | PRAGATHI | | |